ఎందుకు తప్పుతోందో కారణాలు తెలీవు. యురిన ట్రాక్ ఇన్ఫెక్షన్ వల్ల, న్యూరోజెనిక్ బ్లాడర్ వల్ల, మల్టిపుల్ స్క్లిరోసిస్ వల్ల, బ్లాడర్ లో రాళ్ళుండడంవల్ల, కంతులుండడం వల్ల, బ్లాడర్ లో క్షయ వున్నా ఈరకంగా మూత్రాశయం మీద కంట్రోల్ తప్పే అవకాశముంది.

మూత్రాశయంనుంచి మూత్రం బయటకు రాకుండా ఓ కండర కవాటం కాపాడుతుంటుంది. ఈ కండర కవాటం పనితనం తగ్గడం వల్ల, దగ్గినప్పుడు, తుమి నప్పుడు లేక ఏదైనా బరువు లేపినప్పుడు, వడివడిగా నడిచినా, పరుగెత్తినా కొద్ది కొద్దిగా తె కుండా బయటికొస్తుంది. దీన్ని 'స్ట్రెస్ ఇన్ కాంటినెన్స్' అంటారు. పిల్లలుకన్న స్త్రీలలో యిది ఎక్కువగా కనిపిస్తుంది. కండరాల ఎక్సర్‌సైజెస్ కొన్ని మందులు నివారణ తోడ్పడతాయి. అరుదుగా శస్త్రి చికిత్సా అవసరం రావచ్చు.

మూత్రాశయం నిండితే ఆ విషయం మనకు సాధారణంగా తెలుస్తూ వుంటుంది. కొంతమందికి ఒక్కోసారి మూత్రాశయ లోపంవల్ల గాని లేక మూత్రాశయాని సంబంధించిన నరాల లోపంవల్లగాని ఈ విషయం మెదడు పసిగట్టలేదు. మూత్రాశయం నిండడంతో మూత్రాశయంలో పీడనం పెరిగి, కండర కవాటాన్ని దాటి మూత్రం బయటి క్ అవుతుంటుంది. ఈ అనారోగ్యాన్ని 'రిటెన్షన్ విత్ ఓవర్‌ఫ్లో ఇన్‌కాంటినెన్స్' అంటారు.

'టోటల్ ఇన్‌కాంపిటెన్స్' కూడా వుంది. దీంట్లో మూత్రాశయంలోని మూత్రం కండరకవాటలోపం వల్ల ఎప్పటికప్పుడు బయటికొచ్చేస్తుంటుంది. ఈ విషయం రోగి తె దు. కంట్రోల్ వుండదు. దీని కారణం యురినరి ట్రాక్ లేకగైనకలాజికల్ ఆపరేషన్ లో యురినరి కవాటాని జరిగే గాయంవల్లే యిలా అవుతోంది. దీని శస్త్రి చి త్స అవసరమవుతుంది.

# ప్రకృతి చికిత్సతో మూత్రపిండాలకి జరిగే మేలు

శరీరంలో ముఖ్యంగా నాలుగు బహిష్కారావయవాలున్నాయి. అవి పెద్ద ప్రేగులు, మూత్రపిండాలు, చర్మము, శ్వాశకోశాలు. సాధారణంగా మూత్ర పిండాలు రెండు వుంటాయి. రక్తంలోని మలిన పదార్థాల్ని మూత్రపిండాలలో వున్న బౌమెన్స్ కాప్స్యూల్స్ వడకొట్టి, ద్రవరూప మలినాలు మూత్రనాళాల ద్వారా మూత్రశయంకి చేరి, అక్కడ నుంచి బయటికి వెళ్ళిపోతుంది.

ఆహార, విహార లోటుపాట్లవల్ల రక్తంలో మలినాలు ఎక్కువై (యూరియా, యూరిక్ యాసిడ్) మూత్రపిండాలు ఎక్కువ శ్రమ చేయవలసి వచ్చి, వాటి పనిని అవి సరిగ్గా చేయలేని పరిస్థితులు వస్తాయి. అప్పుడు మూత్రం గుండా సుగర్, ఆల్బుమిన్ మొదలైన శరీరాని అవసరమైన పదార్థాలు బయటి పోతుంటాయి. మూత్రపిండాలలో రాళ్ళు ఏర్పడడం, మూత్రపిండ కణాలు క్షీణించడం (అట్రోఫి) మూత్రపిండాలలో చీము చేరడం (పైలోనెఫ్రయిటిస్) మూత్రపిండాలలో నీరు చేరడం (హైడ్రోనెఫ్రోసిస్) మూత్రపిండాలు పూర్తిగా పనిచేయకపోవడం (రీనల్ ఫెయిల్యూర్) మొదలైన జబ్బులూ రావచ్చు.

మూత్రపిండాల మీద ఎక్కువ పనిభారం పడకుండా వుండాలంటే మిగిలిన మూడు బహిష్కారావయవాలు సక్రమంగా పని చేస్తుండడం ఎంతో అవసరం! ప్రతీ మూత్రపిండాల వ్యాధిలోనూ చర ం సరిగ్గా పనిచేయక, చెమట సరిగ్గా పట్టకపోవడం గమనించాలి న విషయం !

చర ం ద్వారా మలిన పదార్థాల్ని బహిష్కరించడాని చి త్స చేసి మూత్రపిండాల భారాన్ని తగ్గించవచ్చు.

ఎక్కువగా మాంసాహారం తినా , తినే పదార్థాలలో, ద్రావకాలలో వాడే కృత్రిమ రంగుల వల్ల (రసాయనిక పదార్థాల ప్రభావంవల్ల), విష వాయువుల్ని పీల డం వల్ల, రసాయనిక పరి శ్రమలలో పనిచేసేవారు అపరిశుభ్ర చేతులతో

భోజనం చేయడం వల్ల ఆ రసాయనాలు లోపలకు వెళ్ళి మూత్రపిండాలు దెబ్బ తింటాయి. మధుమేహ వ్యాధిలో కూడ మూత్రపిండాలు దెబ్బ తినవచ్చు. దీని 'డయాబెటిక్ నెఫ్రోపతి' అంటారు.



విద్యుత్ యంత్రముతో మ

అనారోగ్యం రాగానే వెంటనే సరైన జాగ్రత్తలు తీసుకొని, రక్తంలో మలినాలు ఎక్కువ కాకుండా చూసుకుంటూ మూత్రపిండాల మీద భారాన్ని తగ్గించడం ద్వారా మూత్రపిండాలు సరిగ్గా పని చేయకలిగేట్లు చేయవచ్చు.

చల్లనీళ్ళతోటి స్నానం, గోరువెచ్చని నీటి స్పయినల్ బాత్, సూర్యకిరణ చి త్స, ఆవిరి స్నానం, అయస్కాంత జల సేవనముతో మూత్రపిండకణాలు సరిగా పనిచేసేట్లు చేసి, ఇతర బహిష్కారావయవాల ద్వారా రక్తంలోని మలినాలు బయటకు నెట్టివేసేట్లు చెయ్యవచ్చు.

మూత్రపిండ వ్యాధులొస్తే, మూత్రము రంగు మారుతుంది. మూత్రం పోసేప్పుడు నొప్పి కలగడం, తొడనొప్పి, వాంతులు, ప్రొద్దున లేవగానే ముఖం

ఉబ్బినట్లనిపించడం, మూత్రం సరైన పరిమాణంలో విసర్జింపబడక శరీరంలో నీరు నిల్వ వుండడం లాంటి లక్షణాలు కనిపించగానే తగిన పరీక్షలు చేయించుకుని, ఆహార విహార నియమాల్ని పాటించినట్లయితే మూత్రపిండ వ్యాధుల్ని నివారించడాని వీలవుతుంది.

కొన్ని రకాల జ్వరాల్లో కూడా మూత్రపిండాలు దెబ్బ తినడాని అవకాశముంది. మూత్రపిండాలు తొందరగా దెబ్బ తినవు. శరీరం ఇచ్చిన సూచనలను నిర్లక్ష్యం చేయడం వల్ల మూత్రపిండాల అనర్థం జరుగుతుంటుంది.

మూత్రాశయంలో మలిన పదార్థాలు ఎక్కువగా నిలవుంటే అక్కడ సూక్ష్మ ములు వుత్పత్తి అయి ఇన్ ఫెక్షన్ కలుగుతుంది. జననేంద్రియాల దగ్గర పరిశుభ్రంగా వుంచుకోవడం ముఖ్యం. బార్లినీళ్ళు, కొబ్బరి నీళ్ళు త్రాగడం వల్ల మూత్రం సాఫీగా అయి మూత్రాశయంలో సూక్ష్మజీవులు నిలవకుండా చేయడాని వీలవుతుంది. ప్రతీ మూత్రకోశవ్యాధిలోనూ మలబద్ధకం లేకుండా చేయడం చాలా అవసరం.

మూత్రపిండాలలో మూత్రనాళాల్లో మూత్రకోశంలో వుండే అయస్కాంత వుత్తర ధృవాన్ని ఆ ప్రదేశాలలో వుంచడంవల్ల రాళ్ళు కరిగి, మూత్రం గుండా బయటకి వచ్చేయడానికి అవకాశముంది. అయస్కాంత చికిత్సతో బాటు అయస్కాంత ఉత్తర ధృవ జలాన్ని పూటకు రెండు ఔన్సుల చొప్పున తీసుకోవడం అవసరం.

# మూత్ర విసర్జక వ్యవస్థ – హోమియో వైద్యం

దేహ విసర్జక వ్యవస్థలో మూత్రపిండాలు అతిముఖ్యమైన పాత్ర వహిస్తున్నాయి. దేహంలోని జీవరసాయన వాతావరణం, సమతుల్యం, మనం నోటితో తీసుకునే ఆహారంకంటేనూ, మూత్రపిండాలు ఏయే రసాయన పదార్థాలను విసర్జిస్తున్నాయో వేటిని శరీరంలో నిలుపుతాయో అనే అంశాల్నిబట్టి వుంటుంది.

జీవ పరిణామ క్రమంలో ముందుగా సముద్రజలాలలో జలచర జీవులు ఆవిర్భవించాయి. జలచరాలనుండి పరిణామం భూచరాల దిశవైపు ముందుకు సాగింది. భూచరాల దిశ ఆవిర్భావంలో దేహంలోని మూత్రపిండాల పాత్ర కీలకమైంది. జీవులు సముద్రాలలో ఉన్నప్పటిలాగే వాటి శరీరాలలో ద్రవసమతుల్యతను కాపాడే బాధ్యత మూత్రపిండాలపై బడింది. భూమిపై నివసించే జీవులకు నిర్జలస్థితి (డీహైడ్రేషన్) రాకుండా కాపాడేది మూత్రపిండాలే. వివిధ అవయవాల్లో జీవకార్య నిర్వహణతో శరీరానికి అవసరంలేని ఎన్నో రసాయన పదార్థాలు శరీరంలో పేరుకు పోతుంటాయి. వీటినే మలినాలంటాము. ఈ మలినాలకు ఎప్పటికప్పుడు శరీరంనుండి విసర్జించే బాధ్యత మూత్రపిండాలదే. శరీరంలో ఎన్నోరకాల జీవ రసాయన పదార్థాలు వివిధ జీవక్రియలలో తోడ్పడుతున్నాయి. ఈ జీవ రసాయన పదార్థాల సమతుల్యత కాపాడేది మూత్రపిండాలే! అందుకే మూత్రపిండాల పనితనంలో ఇబ్బంది కలిగితే శరీరంలోని కీలకమైన అన్ని జీవన క్రియలు సక్రమంగా నెరవేరక ఇబ్బంది పెడతాయి. ఎంతో ప్రధానమైన, కీలకమైన బాధ్యతలను మూత్రపిండాలు నిర్వహిస్తున్నాయి. కనుక శరీరంలో అన్ని ఇతర అవయవాలకన్నా మూత్రపిండాలకే గుండె నుండి ఎక్కువ రక్తం ప్రవహిస్తోంది. రక్త ప్రవాహ నియంత్రణలో మూత్రపిండాల పాత్ర అతి కీలకం! రక్త ప్రవాహం మొత్తంలో నాలుగోవంతు మూత్రపిండాలగుండా నిరంతరం ప్రవహిస్తుండాల్సిందే! ఆ కారణంగానే రక్తపోటు విషయంలో మూత్రపిండాలు చాలా సున్నితమైన, ప్రధానమైన పాత్రని నిర్వహిస్తుంటాయి.

రక్తపోటును మూత్రపిండాలు ఖచ్చితంగా నియంత్రణ చేయాలి. రక్తపోటు ఎక్కువయితే ఆ వత్తిడి ధాటి మూత్రపిండాలలోని సున్నితమైన పొరచిట్లి రక్తం నేరుగా మూత్రకోశంలోకి చేరుకుని మూత్రంలో రక్తం కనిపించవచ్చు. మూత్రపిండాలలోని ఫంక్షన్ యూనిట్ అయిన నెఫ్రాన్ మధ్య భాగంలో కొన్ని ప్రత్యేకతలు రక్త ప్రవాహం తీరునిబట్టి రక్తపోటును పసిగడతాయి. రక్తపీడనము హెచ్చు తగ్గులను గమనించి ఈ కణాలు 'రెనిన్' అనే రసాయన పదార్థాన్ని తయారు చేస్తాయి. రెనిన్ అనే రసాయన పదార్థం రక్తనాళాల పరిమాణాన్ని నియంత్రణ చేసి రక్తపోటును తగ్గించటము గాని, పెంచటం గాని చేస్తాయి. రెనిన్, ఆల్డోస్టిరోన్ అనే హార్ ్న్ ఉత్పత్తిని ప్రభావితం చేస్తుంది. ఆల్డోస్టిరోన్ నె ఫ్రాన్‌లని ప్రభావితం చేసి మూత్రము ద్వారా బయటకుపోయే లవణాల్ని, నీటిని అధిక శాతం స్వీకరించి రక్తంలోకి చేరుస్తుంది. తద్వారా రక్త పరిమాణం పెరుగుతుంది. అందువలన కూడా రక్తపీడనము పెరుగుతుంది. ఒక రకంగా రక్తపోటు పెరిగినట్టయితే మూత్రపిండాల కణజాలం దెబ్బ తింటుంది. ఈ రకంగా రక్తపోటుకి మూ త్రపిండాలకు చాలా దగ్గర సంబంధం వుంది.

కొన్ని సందర్భాల్లో ఏది కారణమో, ఏది ఫలితమో కూడా తెలుసుకోవటం కష్టమవుతుంది. రక్తపోటు పెరగటం వల్ల గుండె, మెదడు ప్రభావితమవుతాయి. మూత్రపిండాల వడపోత శ్తి ఏమా త్రము తగ్గినా, రక్తంలో యూరియా వంటి లక పదార్థాలు పేరుకుపోయి శ్వాసకోశ వ్యవస్థ, జీర్ణవ్యవస్థ దెబ్బ తింటాయి. ఈ విధంగా మూత్రపిండాలు కేవలం విసర్జన యనే కాకుండా, కీలకమయిన శరీరంలోని అన్ని ముఖ్యమయిన అవయవాలతో సంబంధము వుండి జీవకార్యాలను ప్రభావితం చేస్తుంటాయి. అందుకే హోమియో వైద్యంలో, బాధ ఏ అవయవానికి సంబంధించినదయినా రోగి పూర్తి లక్షణాలను సేకరిస్తారు. అవయవాని , అవయవాని మధ్య విడదీయరాని సన్నిహిత సంబంధం వుంటుంది.

ఇంత లక పాత్ర వహిస్తున్న మూత్రపిండాలు తరచుగా వ్యాధికి లోనవటం చూస్తూంటాము. మూత్రపిండాలు, మూ త్రనాళాలు మూ త్రాశయము, మూత్రనాళాలకు సంబంధించిన అనేక వ్యాధులకు హోమియో వైద్యంలో

చక్కటి చికిత్స వుంది. రోగి ఏ రకమైన మూత్ర అవయవాల వ్యాధితో బాధ పడుతున్నప్పటికీ, మిగతావి శారీరక, మానసిక బాధలన్నింటినీ హోమియో వైద్యానికి తెలుపవలసి వుంటుంది. అటువంటప్పుడు మాత్రమే వైద్యుడు రోగి శారీరక, మానసికతత్వాన్ని సరిగ్గా అధ్యయనం చేసి రోగాన్ని శాశ్వతంగా దూరం చేయటానికి వీలవుతుంది. దీర్ఘకాలికంగా వుండే వ్యాధులకు చికిత్స కాలం అధికంగా వుంటుంది. తరుణ వ్యాధులకు (యాక్యూట్ డిసీజెస్) అత్యవసర పరిస్థితులలో కొన్ని నిముషాలమీద పని చేసే దివ్య ఔషధాలు హోమియో వైద్యంలో వున్నాయి.

## మూత్రపిండాల్లో రాళ్ళు

మూత్రపిండాల్లో రాళ్ళు ఏర్పడటమనేది ఈ మధ్య కాలంలో చాలా తరచుగా చూస్తున్నాము. మూత్రావయవాల్లో రాళ్ళు ఏ స్థాయిలో కనిపించినప్పటికీ, ఏర్పడేది మూత్రపిండాల్లోనే! ఈ వ్యాధి అన్ని వయస్సుల్లో, అన్ని ప్రదేశాల్లో, లింగ భేదం లేకుండా సంభవిస్తుంది. నూటిలో పదిమంది ఏదో ఒక వయసులో మూత్రపిండాలు రాళ్ళతో బాధపడుతున్నట్టు ఒక అంచనా. మూత్రపిండాల్లో రాళ్ళు ఏర్పడే విధానం కాని, మూలకారణాలు కాని నిర్దిష్టంగా తెలియవనే చెప్పాలి. పలు ప్రాతిపదిత కారణాలున్నాయి. ఈ పని చేయు కారణాలు రోగికి, రోగికి భేదముంటుంది. అసలు మూత్రపిండాల్లో రాళ్ళు ఏర్పడ్డమనేది ఒక వ్యాధి కాదు. మెటబోలిజమ్‌లోవున్న లోటుపాట్లవల్ల ఫలితమే అని చెప్పవచ్చు. అందుకే మూత్రపిండాల రాళ్ళు వ్యాధిని వ్యాధి అనే కంటే వ్యాధి ఫలితము అనడం ఉత్తమము. 90% మూత్రపిండాల రాళ్ళలో కాల్షియమ్ వుంటుంది. ఇది ఆక్సలేట్ లేదా ఫాస్పేట్ రూపంలో వుంటుంది. మిగిలిన పదిశాతం కేసుల్లోని రాళ్లలో యూరిక్ ఆసిడ్, సిస్టన్, జంతిన్ లాంటి రసాయన పదార్థాలుంటాయి. మామూలు ఎక్స్‌రేలలో కాల్షియమ్ రాళ్ళు కనిపిస్తాయి. కాని జంతిన్, సిస్టన్‌లతో కూడిన రాళ్ళు కనిపించవు.

'డి' విటమిన్ బిళ్ళలు, కాల్షియమ్ బిళ్ళలు అధికంగా వాడటం, కాల్షియం అధికంగా వున్న ఆహార పదార్థాలను అధికంగా భుజించటం వల్ల మూత్ర

పిండాల రాళ్ళు ఏర్పడటాని అవకాశాలుంటాయి. గౌట్, హైపర్ పారా థైరాయిడిన్స్ వంటి వ్యాధుల్లో కూడా మూత్రపిండాల్లో రాళ్ళు ఏర్పడతాయి.

మూత్రపిండాల రాళ్ళు వ్యాధిలో వ్యాధి లక్షణాలు రోగి , రోగికి మారు తాయి. కొన్నిసార్లు ఢ్నిలో రాయి వున్న విషయం చాలాకాలం తెలియక పోవచ్చు. రాయిలో రకాన్ని బట్టి, రాయివున్న స్థానాన్ని బట్టి నొప్పి తీవ్రత, స్థలం వుంటాయి. కొన్నిసార్లు మూత్ర అవయవాల్లో రాయి వున్న విషయం రోగి తెలియకపోవచ్చు. రే బాధకొరకు ఎక్స్‌రే తీయించుకున్నపుడు మాత్రమే మూత్రపిండాల్లో రాయి వున్న విషయం బయటపడుతుంది. కొన్ని సమయాల్లో మూత్రావయవల్లో రాళ్ళు పొట్టలో తీవ్రమైన బాధను కలుగచేస్తాయి. తెరలు తెరలుగా వచ్చే బాధను 'రీనల్ కోలిక్' అంటారు. నొప్పి అధికమై వికారం, కడుపులో తిప్పటం, వాంతులు అవటం జరుగుతుంది. కొన్నిసార్లు రాయి వత్తిడి మూత్రపిండాల్లో పొరలు రాసుకుపోవటం వల్ల మూత్రంలో రక్తం రావచ్చు. మూత్రపిండాల రాళ్ళవల్ల కలిగే ముఖ్యమైన ఫలితం ఇన్ఫెక్షన్ . చలితో పెద్ద పెట్టున జ్వరం రావటం, మూత్రంలో మంట, మూత్రం సజావుగా రాకపోవటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. రాయి పెద్దగా వుండి మూ త్రపిండాలు పెల్విస్ లేదా యూరేటర్ పై భాగంలో వుండి మూత్రం రావటం అటకాయించి నట్టయితే మూ త్రపిండం నీటి తిత్తిలాగా తయారయి చెడిపోయే అవకాశం వుంది. ఈ స్థితినే 'హైడ్రో నెఫ్రోసిస్' అంటారు. మూత్రపిండంలోనుండి రాళ్ళు అప్పుడప్పుడు వాటంతట అవే జారి మూ త్రంలో బయటకు వస్తుం టాయి. రాయి పరిమాణం, స్థానం మొదలైన విషయాలు తెలుసుకోవాలంటే ఎక్స్‌రే, ఐ.వి.పి., అల్ట్రాసౌండ్ వంటి ప క్షలు జరపాలి.

ఏ రకమైన చిక్కులు లేకుండా కేవలం నొప్పితో మాత్రమే బాధపడు తుంటే, ఆ కేసుల విషయంలో త్వరపడి శస్త్రచి త్స చేయవలసిన అవసరము లేదు. యాంత్రికంగా రాళ్ళను బయటకు లాగటాని ఏ రకమైన ప్రయత్నము చేయవలసిన అసరము లేదు. ఇన్ ఫెక్షన్‌ను మాత్రం ఆలస్యంలేకుండా మందు లతో నయం చేసుకోవాలి. రాయి మూ త్రనాళాల్లో క్రింది జరుగుతున్నపుడు

మధ్య, మధ్య నొప్పి వస్తుంటుంది. నొప్పి మొదట్లో డొక్కలో కనిపించి క్రమ క్రమంగా ముందుకు వచ్చి గజ్జల్లో చేరుతుంది.

మూత్రకోశంలో రాయిపడిపోగానే నొప్పి తగ్గుతుంది. తరువాత వెంటనే మూత్రంతో పాటు రాయి బయటకు వస్తుంది. బయట పడిన రాళ్ళను పరీక్ష చేసి ఏ లవణాలతో అవి ఏర్పడినాయని తెలుసుకోవటం అవసరము. ఆ లవణాలను తినటం మానేస్తే రాళ్ళు ఏర్పడటం తగ్గే అవకాశం వుంటుంది. నీళ్ళుకూడా అధికంగా తీసుకోవాలి.

మూత్రపిండాలలో రాళ్ళు ఏర్పడటానికి నూటికి 90 కేసుల్లో ఈ రోజుకూ కారణాలు తెలియవు. మూత్ర తయారీలో దోహదంచేసి జీవ రసా యనిక శక్తుల సమతుల్యత లోపించటం కారణంగానే రాళ్ళు ఏర్పడుతున్నాయని భావిస్తున్నారు. ఈ రకమైన కేసులను 'ఇడియోపతిక్' స్టోన్ డిసీజ్' అంటారు. అందుకే కొన్ని కేసుల్లో కిడ్నీ రాళ్ళను ఆపరేషన్ చేసి తీసివేసిన తర్వాత కూడా, రోగి ఎన్ని జాగ్రత్తలు పాటించినా మ ళ్ళ, మ ళ్ళ రాళ్ళు ఏర్పడటం చూస్తున్నాం.

హోమియో వైద్య విధానంలో మూత్రపిండాల రాళ్ళతో బాధపడే రోగులకు చక్కటి చి త్స వుంది. రాయి కదిలేటపుడు కలిగే విప తమైన బాధకు బెల్లడోనా, బెరిబెరిస్ వల్గారిసస్ వంటి మందులు ఈ పొటెన్సీ మోతాదుల్లో వాడినట్టయితే యూరేటర్స్ పరిమాణాన్ని పెంచి, రాయిని సాఫీగా క్రింది చేరేటట్టుగా చేస్తాయి. రాయి సులభంగా బయటకు వస్తుంది. సాధ్యమయినంతవరకు శస్త్రి చికిత్సను దూరం చేయవచ్చు. నొప్పి కూడా తగ్గిపోతుంది. కొన్నిసార్లు ఆపరేషన్ తప్పకపోవచ్చు. రాయి తొలగిపోయిన తర్వాత మ ళ్ళ రాళ్ళు ఏర్పడకుండా కానిస్టిట్యూషనల్ ట్రీట్‌మెంట్ యివ్వవలసి వుంటుంది. శారీరక, మానసిక లక్షణాలనుబట్టి మందులను ఎంపిక చేసి కొంత కాలం వాడినట్టయితే మూత్రపిండాల్లో రాళ్ళు ఏర్పడకుండా నివారించుకోవచ్చు. జీవ రసాయనిక శక్తుల సమతుల్యాన్ని కలుగజేసే శక్తి హోమియో పొటెన్సీలకి

వుంది. ఆహారం విషయంలో తగిన మార్పులు చేసుకోవాలి. ఉప్పు, కాల్షియం, విటమిన్-డి, మాంసాహారం మానుకోవాలి. నీళ్ళు అధికంగా తీసుకోవాలి.

## యురినరీ ట్రాక్ ఇన్‌ఫెక్షన్

మూత్రపిండాల నుండి విసర్జింపబడే మూత్రము మూత్రనాళము, మూత్రాశయం ద్వారా మూత్రమే బయటకు విసర్జింపబడుతుంది. ఈ మూత్ర అవయవాలు చాలా తరచుగా ఇన్‌ఫెక్షన్ గురవుతుంటాయి. కొన్నిసార్లు మూత్ర అవయవాల్లో రాళ్ళు, లేదా ప్రోస్ట్రేట్ గ్రంథి వాపు వలన మూత్రనాళాల దారి సంకోచించి ఇన్‌ఫెక్షన్ వస్తుంటుంది. అలాంటపుడు కారణాన్ని తొలగించ వలసి వుంటుంది. మూత్రనాళాలు ఇన్‌ఫెక్షన్‌కు గురికాకుండా మూత్రము ఆమ్ల లక్షణాన్ని కలిగి వుంటుంది. దేహరక్షణ వ్యవస్థ పటిష్టంగా వున్నంతకాలం ఏ ఇన్‌ఫెక్షన్ సోకదని గుర్తుంచుకోవాలి. ఇన్‌ఫెక్షన్‌లో అక్యూట్ మరియు క్రానిక్ అని రెండు రకాలు. అక్యూట్ రకంలో ఇన్‌ఫెక్షన్ అకస్మాత్తుగా వచ్చి కొన్ని రోజులు బాధపెట్టి, పూర్తిగా నయమవుతుంది. కొన్ని యాంటీ బ్యాక్టీరియల్ మందులతో వ్యాధి ఆగుతుంది. కొన్నిసార్లు అదే ఇన్‌ఫెక్షన్ అశ్రద్ధ చేసినటయితే క్రానిక్ అవుతుంది.



మూత్రపిండాలు వ్యర్థాలను యిలా వడకడతాయి.

యూరిన ట్రాక్ ఇన్‌ఫెక్షన్‌లో ముందుగా లక్షణాలు మూ త్రం పోసే టప్పుడు మంట రావటం, మూత్రం సాఫీగా రాక కొద్ది కొద్దిగా రావటం, నొప్పి కడుపు వరకు పీ-నట్టవటం జరుగుతుంది. మూ త్రం కొద్దిగా పసుపు పచ్చగా లేదా ఎరుపు రంగుగా రావచ్చు. ఇన్‌ఫెక్షన్ మోతాదు మించినట్టయితే పెద్ద పెట్టున, చలిజ్వరం రావటం, వణకటం వుంటాయి. వ్యాధి లక్షణాలు సేకరించి, మందును ఎంపిక చేసి వాడినట్టయితే అక్యూట్ యురిన ఇన్‌ఫెక్షన్ పూర్తిగా నయమవుతుంది. నీరు అధికంగా తీసుకోవాలి.

క్రానిక్ ఇన్‌ఫెక్షన్ పూర్తిగా తగ్గించటానికి కొంత సమయం పడుతుది. ఇది ముఖ్యంగా 'గోనోకోకల్ ఇన్‌ఫెక్షన్' వల్ల వస్తుంది. ఇన్‌ఫెక్షన్ క్రానిక్ అయినపుడు మూత్రనాళంలో స్ట్రిక్చర్స్ ఏర్పడుతాయి. మూత్రనాళంలోని జిగురు పొర కలిసిపోయి మూత్రనాళం లోపలి పరిమాణం తగ్గుతుంది. మూత్రం పోసే దారి సన్నగిల్లి, మూత్రం పోసేటప్పుడు రోగి కడుపు కండరా లతో వత్తిడి చేయవలసి వుంటుంది. కొన్నిసార్లు మూ త్రం ధార చీలినట్టుగా వస్తుంది. స్ట్రిక్చర్ పెద్దదయినట్టయితే మూత్రనాళం పూర్తిగా మూసుకుపోయి మూ త విస న ఆగిపోతుంది. మూ త్రాశయం ఉబ్బుతుంది. ఆ పరిస్థితుల్లో శస్త్రి చి- త్సచేసి మూత్రాశయ ద్వారం తీయవలసి వుంటుంది.

ఇన్‌ఫెక్షన్ ఆరంభ దశలో వున్నప్పుడే హోమియో మందులు వాడినట్ట యితే ఇన్‌ఫెక్షన్ పూర్తిగా నివారించుకోవచ్చు. స్ట్రిక్చర్లు ఏర్పడితే కూడా స్టాఫిసాగ్రియా, తూజా వంటి దీర్ఘకాలిక మందులను ఎంపిక చేసి వాడినట్టయితే శస్త్రి చికిత్స అవసరం లేకుండా నయం చేసుకోవచ్చు. క్రానిక్ ఇన్‌ఫెక్షన్‌ను పూర్తిగా నయం చేయటంలో కొంత సమయం పడుతుంది.

ప్రోస్టేట్ గ్రంథి ఇన్‌ఫెక్షన్‌కు గురవటం వలన, లేదా వాపు వలన కూడా మూ త్రం ఆగిపోవటం, ఇన్‌ఫెక్షన్ రావటం జరుగుతుంది. ముఖ్యంగా యిది 60 ఏళ్ళు పై బడినవారిలో ప్రోస్టేట్ గ్రంథి వాపు రావటం జరుగుతుంది. కాథటరైజేషన్ చేస్తుంటారు. తాత్కాలికంగా నయమనిపించినా మళ్ళీ మూత్ర నాళం సంకోచిస్తుంది. హోమియోవైద్యంలో, కోనియం, లైకోపోడియం,

డిజిటాలిస్, ఆర్నికా వంటి మందులు ఎంపిక చేసి సరి అయిన క్రమంలో వాడిన ట్లయితే ప్రోస్టేట్ గ్రంథి వాపును తగ్గించుకోవచ్చు. తర్వాత యురినరీ ఇన్ ఫెక్షన్‌ని పూర్తిగా నయం చేసుకోవచ్చు. ప్రోస్టేట్ గ్రంథిలో ఒక్కొక్కసారి క్యాన్సర్ కూడా వస్తుంది. తగిన పరీక్షలు చేయించుకుని కాన్సర్ కణాలు వున్నాయో లేదో నిర్ణయించవలసి వుంటుంది.

## నె ఫ్రయిటిస్

మూ త్రపిండంలో ఏ భాగంలో ఇన్ ఫెక్షన్ చోటు చేసుకున్నా 'నె ఫ్రయిటిస్' అని అంటారు. సాధారణంగా నె ఫ్రానులలో వుండే సూక్ష్మ నాళికలు ఇన్ ఫెక్షన్ ప్రభావాని గురవుతుంటాయి. దీనిని 'అక్యూట్ గ్లోమెర్యూలో నెఫ్రెయిటిస్' అంటారు. మూ త్రపిండంలో వాపు కనిపిస్తుంది. మూత్రపిండంలో రక్తాన్ని వడ కట్టే కార్య క్రమం తాత్కాలికంగా దెబ్బ తింటుంది. మూత్రనాళం ద్వారా సో నేరుగా మూత్రపిండాలు ఇన్ ఫెక్షన్ గురవటం లేదు. గొంతులో చర ం మీద, బ్యాక్టీరియా ఇన్ ఫెక్షన్ కారణంగా, కొన్నిసార్లు మీజిల్స్ వల్ల మూ త్రపిండాల సూక్ష్మనాళికలు వాస్తాయి. శ రంలో వుండే ఇన్ ఫెక్షన్‌ని ఎదుర్కోవటాని దేహరక్షణ వ్యవస్థ రక్తంలో యాంటీబాడీస్‌ని తయారు చేస్తుంది. ఈ యాంటీ బాడీలు మూత్రపిండంలోని సూక్ష్మనాళికలను దెబ్బ కొట్టటం జరుగుతుంది. నె ఫ్రయిటిస్ కనిపించటాని రెండు వారాలముందే గొంతులో చెవిలో లేదా చర ంపై ఇన్ ఫెక్షన్ వుండి వుంటుంది. ఈ వ్యాధి ఆడపిల్లల్లోకంటే మగ పిల్లల్లో అధికంగా కనిపిస్తుంది.

నె ఫ్రయిటిస్ తరుణ వ్యాధి. భయపడవలసిన అవసరం లేదు. వడపోత కార్యక్రమం తాత్కాలికంగా నిలిచిపోవటం వలన శరీరంలో ఉప్పు, నీరు నిలువ వుండిపోతాయి. శరీరం ఉబు తుంది. ఈ ఉబ్బు ముఖంలో, కళ్ళచుట్టూ అధి కంగా కనిపిస్తుంది. రక్తకణాలు కలిసిపోవటం వల్ల మూత్రం ఎర్రగా కనిపిస్తుంది. కాలి మడమ చుట్టూ వాపు, రక్తపోటు పెరగటం జ్వరం లాంటి లక్షణాలు కనిపిస్తాయి. సరిఅయిన చి త్సతో పిల్లలు మూడు వారాల్లో పూర్తిగా కోలుకుం

టారు. ఈ వ్యాధిని చాలా సులభంగా హోమియో వైద్యంలో నివారించుకోవచ్చు. చర వ్యాధి, గొంతునొప్పి, ఇన్ ఫెక్షన్ వచ్చినప్పుడు పూర్తిగా నయం చేసుకోవాలి. ఎపిస్, ఆర్సెనికమ్, ఆల్టం, ఫాస్ఫరస్, కాలికార్బ్ వంటి మందులను ఎంపికచేసి సరిఅయిన సమయంలో శ్రద్ధగా మందులు వాడినట్టయితే నెఫ్రయిటిస్ వ్యాధిని పూర్తిగా నయం చేసుకోవచ్చు.

అక్యూట్ నెఫ్రయిటిస్‌ను అశ్రద్ధచేసినట్టయితే కొన్నిసార్లు గుండె కాంప్లికేషన్స్ లేదా, క్రానిక్ నెఫ్రయిటిస్‌కు దారి తీయవచ్చు. క్రానిక్ నెఫ్రయిటిస్‌లో మూత్రపిండాల సూక్ష్మ నాళికలు గట్టిబడిపోయి వడపోత కార్యక్రమం క్షీణిస్తుంది. సూక్ష్మనాళికల ద్వారా విసర్జన జరుగుతున్నప్పుడు మ ృ శరీరాని అవసరమయి నీటిని, మాంసకృత్తులూ వెనక్కి తీసుకోవు. అందువలన విపరీతంగా మూత్రం పోవటం, యూరియా, ఎ.పి.ఎన్. వంటి మలిన పదార్థాలు రక్తంలో పేరుకుపోయి క్రమంగా మూత్రపిండాల ఫెయిల్యూర్‌కు దారితీసి రోగి చనిపోయే అవకాశం వుంది. క్రానిక్ నెఫ్రయిటిస్‌లో కూడా రోగి లక్షణాలను సరిగ్గా సేకరించి, సరిఅయిన ఔషధాన్ని ఎంపిక చేసి వాడినట్టయితే మూత్రపిండం మళ్ళీ తన పని ప్రారంభిస్తుంది. క్రానిక్ నెఫ్రయిటిస్‌లో మూత్రపిండం కుంచించుకు పోతుంది. ప్లంబమ్ వంటి హోమియో మందులు అద్భుతంగా పని చేస్తాయి.

## నెఫ్రోటిక్ సిండ్రోమ్

ఈ వ్యాధిలో ముఖం నిదానంగా వాస్తుంది. వళ్ళంతా ఉబ్బుతుంది. మూత్రపిండాలలోని సూక్ష్మనాళికలు దెబ్బ తినటంవలన మూత్రంలో ప్రోటీన్లు అధిక మోతాదుల్లో పోతుంటాయి. ఛాతిలో, కడుపులో నీరు చేరుతుంది. రక్తంలో ప్రొటీన్ తగ్గుతుంది. రక్తంలో హిమోగ్లోబిన్ శాతం తగ్గుతుంది. ఆయాసం, పొట్ట ఉబ్బరం, కడుపులో త్రిప్పటం, వాంతులు అవుతాయి. రోగి చాలా బలహీనపడతాడు.

అనేక మూత్రపిండాల వ్యాధుల వల్ల, మెర్క్యురీ, బిస్మత్ వంటి మెటల్స్ తీసుకోవటం వల్ల పాముకాటు, తేనెటీగ కాటు, పోలిన్ వంటి అల్లెర్జీస్ వల్ల కూడా ఈ నెఫ్రాటిక్ సిండ్రోమ్ వస్తుంది. రీనల్ ఆర్టరీ స్టినోసిస్, మలేరియా, డయాబెటిస్‌లో కూడా నెఫ్రోటిక్ సిండ్రోమ్ రావచ్చు. ఎక్కువ మంది ఈ వ్యాధి తట్టుకున్నప్పటికీ కొద్ది మందిలో శాశ్వతంగా మూత్రపిండాలు దెబ్బ తినిపోయే అవకాశం వుంది.

కారణాన్ని బట్టి ట్రీట్‌మెంట్ ప్లాన్ చేయవలసి వుంటుంది. లక్షణాలనుబట్టి ఫాస్ఫరస్ వంటి మందులు చక్కగా పనిచేస్తాయి. ఇతర మేనేజ్‌మెంట్ పద్ధతులన్నీ పాటించవలసి వుంటుంది. సరిఅయిన సమయంలో డాక్టరుని సంప్రదించి వైద్యం చయించుకున్నట్టయితే మూత్రపిండాలు దెబ్బతినకుండా కాపాడుకోవచ్చు.

## రీనల్ ఫెయిల్యూర్

వివిధ వ్యాధుల్లో మూత్రపిండాలలోని నెఫ్రాన్లు దెబ్బతినటం వల్ల వడపోత కార్యక్రమం దెబ్బ తింటుంది. మూత్రపిండాలు 90 శాతం వరకు దెబ్బ తినే వరకు లక్షణాలు వ్యక్తం కావు. అక్యూట్ రీనల్ ఫెయిల్యూర్‌లో మూత్రపిండం అకస్మాత్తుగా దెబ్బ తింటుంది. మూత్రవిసర్జన జరగదు. మూత్రం రావడం నిలచిపోతుంది. పాచలు వాస్తాయి. ఆయాసం తలనొప్పి కనిపిస్తాయి. నీరు, లవణాలు శరీరంలో నిల్వ వుండడం వల్లనే ఈ బిపి వేగం పెరుగుతుంది. వళ్ళు వాపెక్కుతుంది. రక్తంలో పొటాషియం అయాన్ల పరిమాణం పెరిగి ప్రమాద పరిస్థితులకు దారి తీస్తుంది. గుండె సంకోచ, వ్యాకోచాల లయ తప్పుతుంది. గుండె కొట్టుకోవటం నిలిచిపోవచ్చు. అక్యూట్ రీనల్ ఫెయిల్యూర్‌ని

ఎమర్జెన్సీగా భావించవలసి వుంటుంది. అక్యూట్ కిడ్నీ ఫెయిల్యూర్ ప్రధాన కారణాలు షాక్, ఇన్ఫెక్షన్, సరిపడని మందుల రియాక్షన్, సరిపడని రక్తం ఇవ్వటం మొ॥వాటి వల్ల జరగవచ్చు. కారణాలకు వెంటనే చికిత్స చేసినట్టయితే రోగి కోలుకుంటాడు.ఇలాంటి ఎమర్జెన్సీ పరిస్థితులను నయం చేయటంలో, హోమియో విధానంలో అద్భుతంగా పనిచేసే మందులున్నాయి. క్రానిక్ కిడ్నీ ఫెయిల్యూర్ లో మూత్రపిండాల నెఫ్రాన్లు క్రమంగా దెబ్బతింటాయి. వ్యర్థ పదార్థాలను విసర్జించలేక రక్తంలో యూరియా వంటి పదార్థాలు పేరుకు పోతాయి. రోగి నీరసపడడం, ఆకలి మందగించడం, శరీరం శుష్కించటం జరుగుతుంది. చర్మం పొడలి దురద పెడుతుంది. నోటి నుండి దుర్వాసన, ఆయాసం బాగా వుంటుంది. బి.పి. పెరుగుతుంది. యురేమియా స్థితి ముదిరిన తర్వాత మానసిక లక్షణాలు తోడయి మానసికాందోళన, మగత, స్పృహ తప్పటం, ఫిట్స్ కూడా వస్తాయి.

ఇలాంటి కిడ్నీ ఫెయిల్యూర్ లక్షణాలు కనిపించిన వెంటనే కారణాలను పరిశీలించి, తొలగించవలసి వుంటుంది. రోగి లక్షణాలను బట్టి జాగ్రత్తగా హోమియో మందులు యిచ్చినట్టయితే కిడ్నీ ఫెయిల్యూర్ అరికట్టవచ్చు. కొన్నిసార్లు డయాలిసిస్ చేయవలసి వుంటుంది. మరికొన్నిసార్లు మూత్రపిండాల మార్పిడి తప్పదు.

ఈ రకంగా ఎన్నో మూత్ర అవయవాల వ్యాధులను నయం చేయటంలో హోమియో వైద్యంలో అధునాతనమైన ఔషధాలు వున్నాయి. వ్యాధిని బట్టి ఆహార నియమాలుంటాయి. ఇతర మేనేజ్ మెంట్ పద్ధతులను అనుసరించవలసి వుంటుంది.

# యోగాలో విసర్జ వ్యవస్థ

మానవశరీరం పంచభూతాలతో నిర్మించబడింది. శరీర ప్రక్షాళన పంచ భూతాలతో చేయబడుతుంది. శ రీరం శిథిలమైపోయిన తర్వాత పంచభూతాలలో కలసిపోతుంది.

యోగశాస్త్రం ప్రకారం మనిషి అంటే శరీరం, మనస్సు, ఆత్మ మరియు పంచభూతాలు. విసర్జకావయవాలని పేర్కొనాలంటే వీటన్నింటినీ దృష్టిలో వుంచుకుని నిర్ణయించాల్సి వుంటుంది. భారతీయ తత్వశాస్త్రం ప్రకారం ఆత్మ శిధిలంకాదు.

సంక్షిప్తంగా విసర్జక వ్యవస్థ అంతా "సర్వరోగములాః వష" న ఆయుర్వేద సూక్తిని విజ్ఞప్తి తెస్తుంది. యోగశాస్త్రంలో వీటిని దేహము, చిత్తమలలుగా పేర్కొనవచ్చు.

దేహ మల బహిష్కరణకు కొన్ని ఆసనాలు రూపొందించబడ్డాయి. పవనముక్తాసనం చెడుగాలిని అదోముఖముగా విసర్జించడాని తోడ్పడుతుంది.

మామూలుగా ఏక్టివిటీతోపాటు విశ్రాంతి అవసరము. సాధారణ వ్యాయామంలో ఏక్టివిటీ ఒక్కటే వుంటుంది. ఏక్టివిటీతో శరీరంలో 'లాక్టేట్' అనే జీవ రసాయన పదార్థం పెరుగుతుంది. దీనివలన ఆందోళన, అలసట త్వరగా కలుగుతుంది. దీనిని నివారించడానికి ప్రాచీనయోగులు తమ అనుభవంతో విశ్రాంతి కర ఆసనాలని రూపొందించారు. అవి శవాసనం, మకరాసనం. వీటివల్ల శరీర, మనస్సులకు విశ్రాంతి కలిగి, ప్రశాంతి చేకూరుతుంది.

దేహమలాలు పోగొట్టడానికి షట్ క్రియలు లేక అష్టకర్మలు బాగా తోడ్పడతాయి. హఠయోగ ప్రవర్తకాచార్యుడు మత్స్యేంద్రనాధుడు (పదవ శతాబ్దం) వచనాలను, శ్రీనివాసభట్ట మహాయోగేంద్రుడు హఠరత్నావళిలో ఇలా చెప్పాడు - "మలజారే జారే రోగహరే"

శరీరమలాలను, చిత్తమలాలను బయటికి నెట్టివేయడంతో రోగాలు హరిస్తాయి.

చిత్తమలాలు తొలగించడానికి ప్రాణాయామ, ధ్యాన ప్రక్రియలు తోడ్పడతాయి. శ్వాసకోశంలోని మలినాల్ని ప్రాణాయామ ప్రక్రియతో శుద్ధి చేయవచ్చు.

యోగా లక్ష్యం మనస్సుని సత్వగుణం వైపుకి మరల్చి, ప్రశాంతాన్ని చేకూర్చడం! పరిసర, శరీర శుభ్రత, మనస్సుని ప్రశాంతంగా వుంచడం యోగా ప్రధాన లక్ష్యాలు.

## శరీర శుద్ధికి క్రియలు

### జలనేతి

ముక్కు ద్వారా నీటిని తీసుకొని నోటిద్వారా విడిచిపెట్టడం వ్యుత్క్రమ కపాలభాతి (జలనేతి); నోటిద్వారా తీసుకుని ముక్కులద్వారా విడిచిపెట్టడం 'సీత్క్రమ జలనేతి గోరువెచ్చని నీటిలో కొద్దిగా ఉప్పు సి కలిపి కాడగల పాత్రలో పోయాలి. ఆ కాడ చివర ముక్కు రంధ్రంలో పెట్టి ముందుకు కొంచె వంగి, తలప్రక్క వుంచాలి. భూమ్యాకర్షణశక్తి వల్ల నీరు రెండో ముక్కు రంధ్రంగుండా బయటికి వస్తుంది. ప్రక్రియ పూర్తి అయ్యే వరకు నోరు తెరిచి, గాలిపీల్చాలి. కాడ చివర ముక్కు లోపలి భాగాల్ని తాకకూడదు. నీరు నెమ్మదిగా పోయాలి. ముందు ఒక ముక్కు ద్వారా చేసిన తరువాత రెండో ముక్కుతో చేయాలి. ఈ జలనేతి వల్ల రొంప, సైనస్, ఇస్నోఫిలియా తగ్గుతాయి. కఫదోషాన్ని నిరోధించి, పుర్రెలో వేడి తగ్గిస్తుంది. పార్శ్వపు నొప్పి కూడా తగ్గుతుంది. ఆరోగ్యవంతులు వారానికి ఒకసారి ఈ క్రియచేస్తే చాలు. వాతావరణంలో తేమ ఎక్కువగా ఉన్నప్పుడు వద్దు.



## సూత్రనేతి

జలనేతి చేసిన తర్వాతే సూత్ర తి చేయాలి. దారాన్ని పేని, ముడులు లేకుండా ఎలుకతోకలా 4.5 అడుగుల సూత్రాన్ని తయారుచేయాలి. దీని



నేతినిగాని, కొబ్బరినూనెగాని పట్టించాలి. మైనాన్ని కూడా సూత్రాని పూస్తుంటారు. రబ్బరు తి అయితే స్టెరిలైజ్ చేసి వాడాలి. నేతియొక్క ఒక కొనని ముక్కు రంధ్రంలోకి ప్రవేశపెట్టి మెల్లమెల్లగా నెట్టాలి. సూత్రం కొన అంగిలి చేరు తుంది. డోకుని అదుపులో వుంచి మధ్య లు, చూపుడు లు సాయంతో అంగిలి చేరిన సూత్రాన్ని నోటి వెలుపల నెమ్మదిగా లాగాలి. ముక్కులోంచి బయటి వున్న కొనని, నోటి వెలుపలి వచ్చిన కొనని రెండు చేతులతో పట్టుకొని నెమ్మదిగా ముందు వెనుకలకు, ప్రక్కలకు చలనం చేయాలి. ఒక నిమిషంపాటు ఇలా చేసి సూత్ర నేతిని తీసివేసి చన్నీళ్ళతో నోరు పుక్కిలించి, కళ్ళు శుభ్రపరచాలి. కొంచెము కొంచెముగా మొదట్లో ప్రయత్నిస్తు తుమ్ములు వచ్చినా చేయాలి. నోరు తెరిచే వుంచాలి. శ్లేష్మ దుర్ని తొలగించడాని వాయుసంచారం ఆటంకం లేకుండా చేయడానికి సూత్రనేతి ఉపకరిస్తుంది. ఉబ్బస రోగులకు మంచి ఫలితాలన్నిస్తుంది గురకని తగ్గిస్తుంది. కొయ్యకండలు, టాన్సిల్సు, విస్తరించిన ఆడినయిడ్స్, ముక్కు దిబ్బడవేసినా యోగ నిపుణులను సంప్రదించాలి.

## వమనధౌతి

ఇది కొంచెం కష్టమైన చర్య. నోటిలో వేలు పెట్టుకుని వమనము అభ్యసించాలి. ఈ చర్యవల్ల జీర్ణాశయంనుంచి పదార్థాలు నోటిద్వారా బయటకు వెళ్ళగొట్టబడతాయి. శరీర భాగాల నుంచి జ్ఞాననాడులవల్ల వచ్చిన బాధాపూరితమై ప్రచోదనాలు.... మానసిక ప్రభావాలు -వీటివల్ల వమన మవుతుంది. వమన



కేంద్రము మజ్జాముఖంలో శ్వాస కేంద్రాని సమీపంలో వుంటుంది. కాచి, చల్లార్చి నీటిలో ఉప్పువేసి 4, 5 గ్లాసులు తాగాలి. కొద్ది క్షణాలు ఆగి శ రము ముందుకు వంచి కుడిచేతి చూపుడు, మధ్యవేళ్ళని అంగిటలో కొండనాలికను తాకించి ముందు వెనుకలకి కదిలిస్తే వాంతి అవుతుంది. ఈ్ర యచేస్తే శ్లేష్మరోగాదులగు ఉబ్బసవ్యాధులు తీవ్రత తగ్గుతుంది. ఆహారనాళం శుద్ధి అయి అల్సర్ తగ్గడానికి కూడా మంచి ఫలితాన్నిస్తుంది. ఆకలి పెరుగుతుంది. ఎసిడిటి రోగులు నీటిలో ఉప్పు కలుపుకోకూడదు.

## దండధౌతి

రెండు అడుగుల పొడుగు అర అంగుళం వ్యాసం గల రబ్బరు ట్యూబుని దండధౌతికి ఉప యోగిస్తారు. ఈ రబ్బర్ ట్యూబ్ పై భాగం నున్నగా వుండాలి. ఉత్కటాసనము వేసి గొంతు కూర్చొని డినీటితో వెచ్చచేసిన ట్యూబుకి తేనెనిగాని, తాజావెన్ననిగాని పూయాలి. కొన్ని నీళ్ళు తాగి ట్యూబ్ ఒక చివర నోటిలో ప్రవేశపెట్టి క్రమ క్రమంగా 18 అంగుళాల వరకు ఆహార నాళంలో ప్రవేశపెట్టాలి. అప్పుడు చాలన ్ర యి చేయాలి. ఉబ్బస రోగులయితే సోడాబై కార్బ్ కలిపిన నీళ్ళు వాడాలి. కఫాది మలిన పదార్థాలను తొలగించడానికి, పిత్తసంబంధ వ్యాధుల నిరూ లనకు ఈక్రియ తోడ్పడు తుంది.



## వ స్త్రధౌతి

30 అంగుళాల పొడుగు, 3 అంగుళాల వెడల్పు గల వస్త్రాన్ని నోటిద్వారా జీర్ణాశయంలోకి జొప్పించి చేసే శుద్ధిని 'వ స్త్రధౌతి' అంటారు. బట్టను డి



నీటితో ఉడికించి తీసి నెమ్మ దినెమ్మదిగా మింగాలి. రోజు ఒక జానెడు చొప్పున పెంచుతూ లోపలి పోయేలా అభ్యసించాలి. ఒక అడుగు వస్త్రం మినహా మిగిలినదంతా లోపలికి పోయేలా ప్రాక్టీస్ చేసి అప్పుడు మునిపళ్లతో వస్త్రాన్ని పట్టి, మూడు మార్లు నౌళి చేసి, నెమ దిగా నోటినుంచి తీసే యాలి. మొదట్లో వస్త్రాన్ని మింగడానికి ఇబ్బం దిగా వుంటుంది. అందుకని వస్త్రానికి తేనెగాని, పంచదారగాని, పెరుగుగాని పట్టించాలి. వస్త్రాన్ని బయటి తీసేటప్పుడు రాకపోతే నీరు కొంచెం కొంచెం మింగవచ్చు. వస్త్ర ధౌతి నేర్పు, ఓర్పు చాలా అవసరం. దండధౌతిచేసిన తర్వాత వస్త్రధౌతి చేయాలి. ఉబ్బసం, ప్లీహా, చర రోగాలు ఈ యవల్ల తగ్గుతాయి. గాయకులకు మంచిది. అధిక రక్తపోటు, హృద్రోగములున్నవారు యోగనిపుణుల సలహాతో ఈ క్రియని చేయాలి.

## చ ్ కర్మ

శూలగుల ము మొదలయిన రోగాలు తగ్గించడానికి ప్రేగులలో నిల్వ యున్న దుర్మలాన్ని వెళ్ళగొట్టడానికి ఈ య అవసరం. ఉత్కటాసనమున మలవిసర్జన చేయడానికి కూర్చునట్లు కూర్చోవాలి. ఎడమచేతి చూపుడువేలి గోళ్ళను కత్తిరించి, శు భ్రపరచుకుని, నూనెలోగాని, నెయ్యిలోగాని ఆ వేలుని ముంచి గుద ద్వారములో మెల్లిగా ప్రవేశపెట్టాలి. ప్రవేశపెట్టి వేలుని కొంకిలా చేసి అటు ఇటు తిప్పాలి. సంవరణి కండరాని ఉద్దీపన కలుగుతుంది. ఈ య మితిమీరి దీర్ఘముగా నభ్యసించుట మంచిదికాదు.

## కపాలభాతి

కపాలం అంటే పుర్రె లేక నుదురు, భాతి అంటే ప్రకాశించడం పద్మా సనంలో కూర్చొని చేతుల్ని జ్ఞానముద్రలో వుంచాలి. 'ఉజ్జయి' లో వలె వెన్నె ముక నిటారుగా వుంచాలి. వాస్తవంగా చెప్పాలంటే కపాలభాతి పొట్టకండరాలపై పనిచేసే రేచకపూరకాలు వుంటాయి. పొత్తికడుపు కండరాలు వెనుకకీ, ముందుకీ కదలాలికాని పై క్రింద మాత్రంకాదు. ఈ క్రియ ప్రాణాయామానికి ముందు చేయడం మంచిది. ఒక నిముషానికి గాలిని 120 మారులు వెళ్ళగొట్టాలి. ఈ క్రియవల్ల నాడీమండలం ఉత్తేజమవుతుంది. తక్కువ రక్తపోటు ఉన్నవారు ఇది చేయవచ్చు.

## ఉడ్డియాన

పాదాల మధ్య 1.5 అ. ఎడముంచి, నడుము వంచి చేతులు మోకాళ్ళపై అన్చాలి. చేతుల వేళ్ళు లోపలివైపుకుండాలి. వీలైనంతగాలిని తీవ్రవేగంగా బయటకి విడిచిపెట్టాలి. విడిచిపెట్టి గాలి మళ్ళ లోపలికి రాకుండా కంఠబిలం మూసి బిగపట్టాలి. గాలి బయటకు నెట్టేటప్పుడు మెడ భుజాల కండరాలు బిగపట్టి స్థిరంగా వుంచి, వెనువెంటనే చేతులమీద బరువు అనుకుని నాభి వద్ద పొట్టభాగాన్ని వెనక్కి హెూ క్రించాలి. ఎప్పుడయితే గాలి పీల్చడం జరిగిందో దానితో ఉడ్డియాన ఒక మారు పూర్తయినట్లు. కూర్చొని, నిల్చొని, వెల్లకిలా పైన, తలక్రిందులుగా వున్నప్పుడు పడుకున్నప్పుడు కూడా ఉడ్డీయాన చేయవచ్చు. రోజు నాలుగుసార్లు చేయాలి. కాలేయాన్ని ఈ ప్రక్రియ ఉత్తేజపరుస్తుంది. రక్త సంచారంలో విఘాతం కల్గినవారు, పొట్టసంబంధ తీవ్ర వ్యాధులున్నవారు అనుభవజ్ఞుల సలహో తీసుకుని మాత్రమే ఉడ్డీయా చేయాలి.

భుజములను వంచుకొని – కడుపు కుడిపక్కగాను, ఎడమప్రక్కగాను నీటి సుడివలె అతివేగంగా చుట్టాలి. కూర్చొని చేస్తే దీనిని 'స్వస్తికాసనము' అంటారు. దీనినే నౌలికర . నౌలిమధన, చలననౌలి తేలిక అనే పేర్లలో కూడా

వ్యవహరిస్తుంటారు. ఉడ్డియానపై అదుపువస్తేగాని, నౌలి చేయలేరు. ఉడ్డియాన ఉన్నతస్థితికి చేరాక పొట్టకండరాలు ఆడించాలి. ఉదర క్షయ వ్యాధిగ్రస్తులు, గుండె బలహీనులు, అధిక రక్తపోటు కలవారు, అపెండిసైటిస్ రోగులు, గర్భిణి స్త్రీలు, చిన్నవయసువారు నౌలి చేయరాదు. హఠయోగ క్రియలలో నౌలి కిరీటం వంటిది. కాలేయము, క్లోమము, మూత్రకోశముల చర్యని ఉత్తేజపరుస్తుంది. అజీర్ణం, మలబద్ధకాల నివారణ తోడ్పడుతుంది.

## ప్రాణాయామం

ఆసనాలలో స్థిరత్వం సంపాదించాక ప్రాణాయామం నేర్చుకోవాలనే నియమం వుంది. ప్రాణాయామం అంటే వాయు విరామము లేక వాయు సంయమనం. ఉఛ్వాస నిశ్వాసాల్ని సంయమనం చేయాలి. పతంజలి మహర్షి ఉఛ్వాస, నిశ్వాసాల సంచారము లేకుండా చేయుట అన్నారు.



ప్రాణాయామంలో నాల్గు భాగాలున్నాయి.

పూరక అంటే గాలిని ముక్కులోపలి పీల్చడం 'అంతర కుంభకం' అంటే పీల్చిన గాలిని ఒక పద్ధతి ప్రకారం లోపలి బంధించడం.... 'బాహ్యకుంభకం' అంటే లోపల గాలి లేకుండా ఒక పద్ధతి ప్రకారం బంధించడం... 'రేచకము' అంటే గాలిని నియంత్రణ ద్వారా వదిలిపెట్టడం.

ప్రాణాయామ అనుభవజ్ఞుల ద్వారా నేర్చుకోవాలి. ప్రాణాయామ సాధన అనుబంధంగా జాలందరబంధము, ఉధ్యానబంధం, మూలబంధం కూడా తెలుసుకోవడం అవసరం.

అపాన వాయుద్వారాన్ని బంధింపచేయడాన్ని 'ఆకుపంచనము' అంటారు. ఎడమకాలి మడమని గుదస్థానమందు బంధించడాన్ని 'మూలబంధము' అంటారు. ఇది చేయడం వల్ల యవ్వనత్వం సిద్ధిస్తుంది.

**కుంభకం**

రేచకపూర్వకాలంలో లక్ష్యం సిద్ధించిన తరువాతే కుంభకం సాధించాలన్నది సాం ప్రదాయం.

అసలు ప్రాణాయామం ఎందుకు చేయాలంటే గాలి , మనసుకి సంబం ధం వుంది. వాయువు చలిస్తే చిత్తము చలిస్తుంది.

ఎడమ ముక్కు రం ధ్రం గుండా పూరకం చేసి, కుడిముక్కు – రం ధ్రం గుండా రేచకం చేసి, తర్వాత రేచకం చేసిన కుడిముక్కు ద్వారా పూరకం చేయాలి. దీనినే సుఖ ప్రాణాయామమంటారు. వాసిష్ఠుడు దీనిని నాడి శోధన అని పిలిచాడు.

సామాన్యంగా స్త్రీలు ఛాతి శ్వాస ్రయ చేస్తే పురుషులు ఉదర శ్వాస ్రయ చేస్తారు. మనిషి ఊపిరితిత్తులలో మూడవవంతు పని చేయకుండా వుండిపోతోం దని శా స్త్రజ్ఞుల అభి ప్రాయం. ప్రాణాయామంలో ఈ లోపాన్ని సరిదిద్దవచ్చు.

**కంఠభాతి**

దీనినే కపాలభాతి అంటారు. ఇది చెవి, ముక్కు, కంఠం ఎక్సర్ సైజ్. వ జ్రాసనములో కూర్చుని కంఠబిలము సగం మూసి శక్తివంతముగా నిరంతరము గాలిని దఫదఫాలుగా బయటకు ముక్కుద్వారా వెళ్లగొట్టాలి. నోరుమూసివుంచి నాలుక పళ్ళని తాకుతుండాలి. అప్పుడు వచ్చే శబ్దము రైలు ఇంజన్ ధ్వనిని పోలి వుంటుంది. పొత్తి కడుపు కండరాల్ని బిగపడితే శబ్దము సులువుగా వస్తుంది. కంఠభాతి కుత్తుక, పుర్రెలను శుభ్రపరచడమే కాకుండా థైరాయిడ్ గ్రంధిని వుత్తేజపరుస్తుంది. గొంతులో వున్నకళ్లెను తొలగించి గాయకులకు మంచి స్వరాన్నివ్వడాని తోడ్పడుతుంది.

## నాడిశోధన

రేచక, పూరాకాల ద్వారా నాడులు శుద్ధి చేయడం నాడిశోధన, నియమిత, నిర్ణీత ఆహారం తీసుకుంటూ 3 నెలలు చేస్తే నాడి శుద్ధి కలుగుతుంది.

## సూర్యచంద్రభేద

యోగ పరిభాషలో సూర్య అంటే కుడిముక్కురంధ్రం చంద్ర అంటే ఎడమముక్కు రంధ్రము. కుడిముక్కు వేడిని ఎడమముక్కు శీతలం కల్గిస్తాయి. ద అంటే యాక్టవిటీ అని అర్థం.

రేచక పూరకాలలోలాకాక ఇక్కడ గాలి పీల్చడం, విడిచిపెట్టడం ఒకే ముక్కు రంధ్రంద్వారా జరుగుతుంది. ఒక ముక్కు రంధ్రం ద్వారా చేస్తుంటే, రెండో దాన్ని మూసి వుంచాలి. రేచక పూరకాలలో నెమ్మదిగా గాలి పీలిస్తే సూర్యచంద్ర దలో వేగంగా పీలాలి. ఛాతి కదలకూడదు. పొత్తి కడుపు వెనక్కి ముందుకి కదిలిస్తుండాలి. స్టమక్ ఎక్సర్సైజుగా కొందరు దీన్ని అను కుంటూ వుంటారు. అలసట వస్తే విరామం అవసరం. నిటారుగా కూర్చుని యధాశక్తి చేయాలి. ప్రారంభంలో వేగానికి ప్రాముఖ్యం ఇవ్వకుండా వుదరకోశ కదలికలకు ప్రాధాన్యం ఇవ్వాలి. అధిక రక్తపోటు, గుండె జబ్బు కలవారు దీనిని చేయకూడదు. మూత్రపిండాలు, స్ప్లీన్, క్లోమము, పేంక్రియాలను వుత్తేజము కలిగిస్తుంది. తక్కువ రక్తపోటు వున్న వారికి, అధిక ఆమ్లము గలవారి , మల బద్ధకం వున్నవారికి ఇది చాల మంచిది. రక్తంలోగల చక్కెర శాతాన్ని తగ్గిస్తుంది. జీర్ణశక్తిని పెంపొందిస్తుంది.

## సూర్యభేధన

నిటారుగా కూర్చుని ఎడమచేయి మోచిప్ప దగ్గర వుంచి, కుడిచేయి చిటికెన లు ఉంగరపు లూ రెండూ ముక్కు ఎడమవైపు నొక్కుమీద,



బొటన వేలు కుడివైపు ముక్కు మీద, మధ్య రెండు వేళ్ళూ మడచి వుంచాలి. తర్వాత ముక్కు కుడి రంధ్రం ద్వారా గాలి పీల్చి ఛాతి వరకు వత్తిడి వచ్చేలా కుంభించాలి. శక్తిని బట్టి కుంభకాన్ని పెంచాలి. తొందరపడి చేస్తే ఊపిరితిత్తులు దెబ్బతింటాయి. ఇది చేస్తే వాత దోషాల్ని పోగొట్టడంతోపాటు కడుపులో పురుగులు చస్తాయి.

## ఉజ్జయి

ముక్కు రెండురంధ్రాలతోను గాలిని పూరించి కుంభకముచేసి ఎడమ రంధ్రం ద్వారా గాలిని విడిచి పెట్టాలి. ధ్యానాసనములో నిటారుగా కూర్చుని కళ్ళు మూసుకుని ఉజ్జయి చేయాలి. గాలి పీల్చినంతసేపు ఛాతిని విశాలముచేసి కంఠబిలము కొంతవరకు మూయాలి. కంఠంలోని కఫాది శ్లేష్మాలని పోగొడుతుంది.

## సీత్కారి

నోటితో గాలిపీల్చి ముక్కు ద్వారా విడిచిపెట్టడం, పద్మాసనంలో కూర్చుని నోరుతెరచి క్రింద దవడ కొద్దిగా ముందుకు చాచి దానిపై పైదవడ పళ్ల చేత నొక్కి, నాలుక కత్తెర పళ్ళను నొక్కాలి. రెండు దౌడల మధ్య నాలిక వచ్చి పైన క్రింద కత్తెర పళ్లమధ్య చిన్నసందు వుంటుంది. ముక్కుమూసుకొని గాలి లోపలికి లాగాలి. శక్తికొలది కుంభించి, జాలాంధర బంధ విడిచి ముక్కు ద్వారా విడిచిపెట్టాలి.



## తరి

ధ్యానాసనములో కూర్చుని ముక్కులుమూసి నాలుకని బయటకు చాపి, బద్ద వలె మడచి, గాలిని నోటి ద్వారా నిండుగా పీల్చాలి. నాలిక లోపలికి తీసుకొని, పెదవులు బిగించి, జాలంధర బంధనము చేయాలి. తర్వాత యథాశ్త ముక్కుద్వారా గాలి విడిచిపెట్టాలి. గుల రోగము, జ్వరము, ఆకలి, దాహము, విషముల నివృత్తి జరుగుతుంది.

## భస్త్రిక

పద్మాసనములో నిటారుగా కూర్చుని 20సార్లు స్వేచ్ఛగా కఫాల భాతిచేయాలి. తర్వాత గాఢమయిన పూరకము ముక్కుతో చేయాలి. పొట్టకండరాలు అదుపులో వుంచాలి. కంఠబిలము మూసి, కుడి చేత్తో ముక్కురంధ్రాలు అదిమి, జాలంధర బంధంచేసి కుంభించాలి. దీని వెంట రేచకము వస్తుంది. ముందు భాగము కఫాలభాతిని, రెండోభాగము ఉజ్జయిని పోలి వుంటుంది. కపాలభాతి, సూర్యభేద్ అనుకరలో కూడా భస్త్రిక చేస్తారు.

# మూత్రపిండాల వ్యాధులకు ఆయుర్వేద చికిత్స

ఆయుర్వేద శాస్త్ర ప్రకారంగా మానవశరీరం దోషధాతు మలములచే నిరితమైవున్నది.

వాత, పిత్త, కఫాలు దోషాలు.

రస, రక్త, మాంస, మేధస్సు, హస్థి, మధ్య, శుక్ర - ధాతువులు.

మూత్రము, పురీషము, స్వేదము - మలాల యొక్క ఉపధాతువు. ఇవి చరం ద్వారా బహిర్గతమవుతుంటాయి. ఇది కాలాన్ననుసరించి హెచ్చు, తగ్గులు కలిగివుంటుంది. అంటే ఎండాకాలంలో అతిగా, శీతాకాలంలో స్వల్పంగా శరీరం చెమటను బహిష్కరిస్తుంది. దీనికి అవరోధం కలిగితే చర వ్యాధులేకాక అనేక ఇతర వ్యాధులూ సంభవిస్తాయి. కేవలం కాలంవల్లనేకాక శ ర ప్రకృతినను సరించి, స్థూలకాయులలో అతిగా, కృశులలో తక్కువగా వుంటుంది స్వేదం. ఈ మార్పులు వ్యాయామం ఎక్కువ చేసినప్పుడు, స్థిరంగా కూర్చునప్పుడూ సంభవించవచ్చును.

మలము, ఆహార పరిణామానంతరం ఏర్పడు కిట్టభాగము. మనము సేవించు వివిధ ఆహార పదార్థాలు జీర్ణమైన తదుపరి సారభాగమంతా రసముగా మార్పు చెందగా - మిగిలిన భాగము మలాశయంలో చేరి, మలముగా పరివర్తన చెందుతుంది. ఇది ద్రవ ఆహారపదార్థాలతో తక్కువగా, ఘన ఆహార పదార్థాలతో ఎక్కువగా ఏర్పడుతుంది. మలము హెచ్చుతగ్గులు శ ర ప్రకృతిమీద, నాళములోని మార్పులమీద తీసుకునే ఆహారపదార్థాల మీద ఆధారపడివుంటాయి. వివిధ వ్యాధులలో కూడా మలవృద్ధి క్షీణతలు ఏర్పడతాయి.

మూ త్రము శరీరంలోని ప్రధానమైన మలము. ఇది వృక్కాల నుండి ( డ్నీస్) తయారవుతుంది. సర్వ శరీర వ్యాపితమైన రక్తము మూత్రపిత్తమున చేరి, అక్కడ వడకట్టబడి మలిన పదార్థాలన్నీ మూత్రము ద్వారా విసర్జింప బడతాయి. మూ త్రపిండాలు ఆరోగ్య స్థితిలో వుంటే రక్తములోని కాలుష్యము సరైన తిలో విభజించి, బయటి పంపించును. మూత్రపిండాలు అనారోగ్య కరమైతే సరైన వడపోత కార్యక్రమాన్ని నిర్వర్తించలేక, రక్త దుష్టతకు తద్వారా శరీర అనారోగ్యాని హేతువవుతాయి. అందువల్ల ప్రతి వ్య మూ త్ర పిండాల ఆరోగ్యాని కాపాడుకోవాలి.

మూత్రపిండ వ్యాధులు అమితాహార విహార సేవనం వల్ల దోషములు ప్రకోపించి కలుగుతాయి. అందువల్ల విధిగా ఆహారవిహార నియమాల్ని పాటించడం అవసరం. మధుమేహ రోగిలో సరైన చి త్స – ఆహార నియమాలు పాటించకపోతే మూత్రపిండ వ్యాధులు రావచు . వివిధ శారీరక వ్యాధులలో కూడా సరైన సమ యంలో చికిత్స చేయనిచో మూ త్రపిండాలు దెబ్బ తింటాయి.

మూత్రపిండ వ్యాధులు సంభవించిన వారికి కనురెప్పలు ఉబ్బుతాయి. శరీరంపై వాపు, మూత్రము అల్పముగా వచ్చుట, మూ త్రంలో రక్తం, చీము వచ్చుట, కడుపులో ప్రక్కల యందు నొప్పి సంభవిస్తుంది. ఈ లక్షణాలు కలవాళ్ళు మూత్ర పరీక్ష చేయించడం ద్వారా, అవసరమైతే ఎ ్స్రే స్కానింగ్‌ల ద్వారా రోగనిర్ధారణ చేయించుకుని, వెంట అవసరమైన చికిత్స చేయించు కోవాలి.

మూ త్ర పిండాలలో ఒక్కొక్కప్పుడు రాళ్ళేర్పడవచ్చు. సాధారణంగా ఆహారంలోని లోపంవల్ల తక్కువగా నీరు త్రాగడంవల్ల, మూ త్రంలోని ఘన పదార్థాలు ఒక్కచోట చేరి ఒక ఘనపదార్థంగా ఏర్పడి రాయిగా పరిణమిస్తాయి. ఇట్లేర్పడిన రాళ్ళు మూత్ర ప్రవాహాన్ని అడ్డుకుని, వివిధ వ్యాధుల్ని కలి గిస్తాయి.

ఈ వ్యాధులలో ఆయుర్వేద శాస్త్రంలో శస్త్ర చికిత్స లేకుండా ఔషధ సేవనలో మూత్రపిండాలలోని రాళ్ళని కరిగించి, బయటి పంపించేయవచ్చు. దీనికై పాషాణభేద(కొండపిండిచెట్టు) లాంటి అనేక మొక్కలతో తయారుచేసిన ఔషధాలు వాడుతున్నారు.

ఆయుర్వేదశాస్త్ర ప్రకారం మూత్రపిండాల వ్యాధుల్ని మూత్రకృచ్ఛ్రము మూ త్రాఘాతము, ప్రమేహము అను వ్యాధులుగా వర్గీకరించారు. ఈ వ్యాధు లన్నింటిలోను వాత, పిత్త, కఫదోషాలు వ్యష్టిగాను, సమిష్టిగాను ధూషించి, వ్యాధుల్ని కలుగజేస్తున్నాయి. ఈ వ్యాధులలో వాత ప్రాధాన్యత కలిగి బాధ తోను, పిత్త ప్రాధాన్యతలో మంటలోను, కఫజములో దురదతోను మూత్రము వస్తుంది.

మూత్రపిండ వ్యాధులేకాక మూత్ర వాహి కలందు దోష ప్రకోషములతోను, రాళ్ళతోను వ్యాధులు సంభవించవచ్చు.

మూత్రాశయంలో వివిధ దోషాలతో వ్యాధులు సంభవించుటేగాక పెద్ద సైజు రాళ్ళు ఏర్పడవచ్చు. మూత్రనాళములోను కేవలం మూత్ర సంబంధ వ్యాదులేకాక గనేరియా, సిఫిలిస్‌లాంటి సుఖరోగాలు కలుగుతాయి. వీటన్నింటికే ఆయర్వేద ఔషధాలతో చికిత్స వుంది.

## మూత్రపిండాల జబు ్లు

★ కాన్సర్

★ సిస్టయిటిస్

★ నెఫ్రయిటిస్

★ పైలో నెఫ్రయిటిస్

★ మూత్రనాళంలో రాళ్ళు

★ యురెథ్రయిటిస్

# పారిభాషిక పదాలు – అర్థాలు

ఇన్‌ఫెక్షన్ : సూక్ష్మ ములు శరీరంలోని అవయవాల్లో చొచ్చుకు పోయి, హాని కలిగించడం.

ఇన్‌ఫ్లమేషన్ : సూక్ష్మ ములు చేసే హానిని ఎదుర్కొని, సూక్ష్మ ముల్ని నిర్వీర్యం చేసి బయటకు పంపించే ప యలో అవయవం లోని కణజాలాలు, రక్తకణాలు, యాంటిబాడీస్ స్పందించడమే 'ఇన్‌ఫ్లమేషన్'.

నె ఫ్రోన్ లేక నె ఫ్రాన్ : మూ త్రపిండాలలోని వడపోత ప్రమాణం.

నె ఫ్రయిటిస్ : మూ త్రపిండం ఇన్‌ఫ్లమేషన్‌ని నె ఫ్రయిటిస్ అంటారు.

పైలోనె ఫ్రయిటిస్ : మూ త్రపిండంనుంచి మూ త్రనాళిక క సే భాగాన్ని పెల్విస్ అంటారు. ఈ భాగం ఇన్‌ఫ్లేమ్ కావడం పై లో నె ఫ్రయిటిస్.

సిస్టయిటిస్ : మూత్రాశయం ఇన్‌ఫ్లమేషన్.

యురె థ్రయిటిస్ : మూ త్రనాళం ఇన్‌ఫ్లమేషన్ (చివరలో 'ఐటిస్' వచ్చినవన్నీ ఇన్‌ఫ్లమేషన్‌గా గుర్తించాలి)

యురినరి కాలిక్యులై : మూ త్రపిండంలో రాళ్ళు.

ఎక్యూట్ డిసీజ్ : తరుణవ్యాధి. ఆకస్మికంగా పెద్ద పెట్టున వ్యాధి వచ్చి, కొద్ది గంటలు లేక కొద్ది రోజులుండి తాత్కాలికంగా వ్యాధి తగ్గడం. వ్యాధి తీవ్రత ఎక్యూట్ కేసులలో ఎక్కువగా వుండి, సరైన చి త్స దొరకకపోతే రోగి మరణించవచ్చు.

క్రానిక్ డిసీజ్ : దీర్ఘకాలికంగా వున్న వ్యాధి.

సిండ్రోమ్ : వ్యాధి లక్షణ సముదాయము.

గ్లోమర్యులస్ : వడపోత జరిగే నె ఫ్రాన్ భాగం.

లిథో ట్రోపి : శస్త్ర చికిత్స చేయకుండా మూత్రపిండాలలోని రాళ్ళను పగలగొట్టడం.

రెనిన్ : రక్తపోటుని పెంచడాని మూత్రపిండాల కణజాలం నుంచి వుత్పత్తి అయ్యే రసాయనం. సాధారణంగా మూత్రపిండాలు జబ్బు గురయినా మూత్రపిండాల సరిగా రక్త ప్రసరణ జరగకపోయినా మూత్రపిండాల కణాలనుంచి రక్తంలో రెనిన్ విడుదలవుతుంటుంది.

డయాలసిస్ : మూత్రపిండం దెబ్బ తిన్నప్పుడు కృత్రిమ పద్ధతి ద్వారా రక్తాన్ని వడపోయడం.

కడావర్ డ్నీ : చనిపోయినవాళ్ళనుండి తీసిన మూత్రపిండం.

అ ట్రఫీ : కణజాలం ముడుచుకుపోవడం.

ఆటో ఇమ్యూన్ డిసీజ్ : దేహంలోని రోగ నిరోధక వ్యవస్థ రోగ నిరోధాన్ని బదులు సొంత అవయవాల కణజాలాలకి హాని చేయడం. రోగ నిరోధక వ్యవస్థలో సమతుల్యం లోపించడం వల్ల ఈ స్థితి కలుగుతుంది.

యాంటిబాడీస్ : మన రక్తంలో వుండే ప్రొటీన్ పార్టికల్. సూక్ష్మక్రిముల్ని నిర్వీర్యం చేయడాని , శ రం వీటిని వుత్పత్తి చేస్తుంటుంది.

డైసురియా : మూత్రం పోస్తుంటే నొప్పి కలగడం.

నె ఫ్రోస్టోమి : చర ంద్వారా మూత్రపిండాలలో కేథటర్‌ని పంపి మూత్రాన్ని బయటకు పంపేయడం.

సిస్టొస్టమి : మూత్రాశయం, మూత్రనాళంలో అడ్డంకులున్నప్పుడు పొట్ట ద్వారా మూత్రాశయంలోకి నాళాన్ని పంపి, మూత్రాన్ని బయటకు తీయడం.

ట్యూమర్ : కంతి. శ రంలోని కణజాలాల్లో నిర్దేశించిన దానికంటే అత్యధికంగా కణ విభజన జరిగి, వుబ్బెత్తులేర్పడుతుంటాయి. వీటిని కంతులంటాము. ఈ కంతులు బినైన్, మాలిగ్నెంట్ అని రెండురకాలు. బినైన్ కంతులవల్ల సాధారణంగా త్వరగా పెరగవు. వీటినుంచి రక్తస్రావం జరగదు. ఇతర అవయవాలలోకి చొచ్చుకుపోవు. అందుకని వీటివల్ల ప్రాణాపాయము అంతగా వుండదు. మాల్నిగ్నెంట్ ట్యూమర్స్ పెరుగుదల అతి త్వరగా వుండి, అవయవాలలోకి చాలా వేగంగా చొచ్చుకుపోయి ప్రాణ హానిని కలిగిస్తాయి. ఇవి ఒక అవయవం నుంచి మరొక అవయవానికి త్వరగా వ్యాపించి, - లకావయవాల పని తీరుని దెబ్బ తీయడం వల్ల ప్రాణహాని కలుగుతుంది.

అల్బ్యుమిన్ : రక్తంలో వుండే ప్రోటీన్ పదార్థము. మూత్రపిండాల పని తీరు సరిగా లేనప్పుడు యిది మూత్రంలోకి రక్తంలో నుంచి జారి, బయటికొచ్చేస్తుంటుంది.

ఇన్‌కాంటినెన్స్ : తె కుండా మూత్రము బయటికి వచ్చేయడం.

ఇడియాపతిక్ డిసీజ్ : ఇదమిద్ధంగా కారణం తె ని వ్యాధి.

హైడ్రో నెఫ్రోసిస్ : మూత్ర నాళికలో అడ్డంకి ఏర్పడి మూత్ర పిండం విసర్జించిన మూత్రము సాఫీగా మూత్రాశయంలోకి జారుకోలేక పోవడం వల్ల మూత్రనాళికలలోని నీటి వత్తిడి మూత్ర పిండం మీదకి ఎగదన్నడం వల్ల మూత్రపిండం నీటి తిత్తిలా తయారయ్యే స్థితి.